మేము నీవు మీరు అను రూపములు సిద్ధించును. నీ మీ నే మే యనువానిలోని హల్లులకు అనఁగా నకార మకారములకు వైకల్పికముగ లోపము ఈ సూత్రమున విధింపఁబడుచున్నది. నేను మేము నీవు మీరను సర్వనామములు నాలుగు నిటం బ్రకృతములు కాన వాన నొక్కొక్కదానికి హల్లు లోపించి యొకటియు లోపింపక యొకటియుంగా రెండేసి రూపంబులు గల్గఁగా నుదాహరించుచున్నాఁడు 'ఈవు' ఇత్యాదుల నెనిమిదిటిని.

సూ. ౭౨. బహుత్వంబునకు మేకు నే విభాష నగు.

ఉ. నేము, మేము.

వ్యా. దేశ్యాస్మచ్ఛబ్ద బహువచనరూపము—మేము. 'మే' స్థానమున 'నే' వైకల్పికముగరాఁగా నేము మే మనురూప ద్వితయసిద్ధి. బహుత్వంబున కనుటంజేసి సూత్రోక్తాదేశము వచ్చినను అర్థాభేదము గ్రాహ్యము.

సూ. ౭౩. నిన్ను నన్నుఁ దన్ను వీనియందలి ద్విత్వమున కేనియు, ద్విత్వాయుక్త నువర్ణంబున కేనియు, మిమ్ము మమ్ము తమ్ము వీని యందలి ద్విత్వమునకు లోపంబు వైకల్పికంబు.

ఉ. నినుఁ, నిఁ; ననుఁ, నఁ; తనుఁ, తఁ; మిముఁ, మముఁ తముఁ. 'ఉ. నిఁ, నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ.' 'నఁ నిలువంబెట్టితి.' భాగ. ౧౦ స్కం. 'సీ. పని యేమి పంచినఁ బదపడి చేసెద ననక తఁ బంచిన యాక్షణంబ చేయుచు' భార. ఆది. ౩ ఆ.

వ్యా. దేశ్యాస్మద్యుష్మ దాత్మార్థంబుల ద్వితీయారూపంబులు నన్నును, నిన్నును, తన్నును, మమ్మును, మిమ్మును, తమ్మును; అవసానంబున ద్రుతస్వరలోపము గలుగఁగా నన్నుఁ నిన్నుఁ తన్నుఁ మమ్ముఁ మిమ్ముఁ తమ్ముఁ—అని సిద్ధించును. వీనం దొలి మూఁడింట ద్విత్వమునకైనను ద్విత్వయుక్త నువర్ణంబునకైనను వైకల్పికముగ లోపము గల్గును. ద్విత్వము లోపించిన ననుఁ నినుఁ తనుఁ అనియుం ద్విత్వయుక్తనువర్ణము లోపించిన నఁ నిఁ తఁ అనియుం రూపంబు లేర్పడును. వీని బహువచనరూపము

లలో ద్విత్వమునకుమాత్రమే వైకల్పికలోపము. ద్విత్వము లోపించిన మముక్ మిముక్ తమున్న నిరూపములు ఏర్పడును.

సూ. ౭౮. తాము తమరు తారు నగు (స్పష్టము)

వ్యా. ఇట తాము అనునది తమరు అనియు తారు అనియు నగు నని చెప్పుచున్నాడు. కాని తమరు అనునదే తాము తమరులగునని సూత్రించిన బాగుండెడిది. తమరులోని రేఫమునకు లోపమును ఆద్యక్షరమునకు దీర్ఘముం జేయ, 'తాము' సిద్ధించును. అంతె మలోపంబు నాద్యక్షర దీర్ఘంబుం గల్గ 'తారు' ఏర్పడును.

సూ. ౭౯. నామ పునర్గ్రహణంబుఁ భిన్నంబు నభిన్నంబు నయి తచ్ఛబ్దార్థంబు తత్పర్యాయం బగు.

ఉ. 'వాఁడె సురాసురులెల్ల నడ్డమై వచ్చిన నైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను.' భాగ. ౧౦ స్కం. పూ. (వాఁడె భిన్నరూపము, ఆ సుదర్శనాయుధుఁ డనుట అభిన్నరూపము, సుదర్శనాయుధుఁడు నామపదము.) 'ఎ. గీ. వివిధ పుణ్యకథలు విను వేడ్క నతనిఁ బూజించిరి' భార. ఆది. ౧ ఆ. (అతనిక్ భిన్నరూపము, ఆక్కథకు ననుట అభిన్నరూపము, కథకుఁడు నామపదము.) సీ. కలహంస పలికిన పలుకులు గణియించు పడిదాని పోయిన వలన చూచు' భార. అర. ౬ఆ. (దాని భిన్నరూపము, ఆకలహంస యనుట యభిన్నరూపము, కలహంస నామపదము.) మొ.

వ్యా. ఒకసారి వచ్చిన పేరు నే మఱలఁ గొను నెడం దత్పర్యాయంబుగ తచ్ఛబ్దార్థంబు ప్రయోగింపంబడును, రెండువిధముల నవి ప్రయోగంబులం గాననగుచున్నది. భిన్నంబుగ ననఁగా వేఱుగఁ దన్నామస్థానమునం దానుమాత్రము వచ్చుట; అభిన్నంబుగ ననఁ దన్నామపూరకమై వచ్చుట. ఉదాహృతములలో ఆ సుదర్శనాయుధుఁడు ఆక్కడకుక్ ఆ కలహంస యనునవి యభిన్నరూపములు వాఁడె ఆతనిక్ దాని—అను నవి భిన్నరూపము లని యర్థమగుచున్నది.

సూ. ౭౬. ఒక్కొకచో నామంబె యగు.

ఉ. 'సీ. సురవరు లర్థులై చూఁచుచు నుండగ, నలుపరియించిన నాఁటి యెగ్గు, దలఁచి యిట్టి యాపదలు చేసిరో వేల్పు, లమర కోపము నన యయ్యె నాకు, నీ వియోగదుఃఖము' భార. ఆర ౨ ఆ. మొ.

వ్యా. నామపునర్గ్రహణమునం దత్పర్యాయముగ పూర్వ సూత్రోక్త తచ్ఛబ్దార్థంబె కాక, నామమె వచ్చుటయుం గలదు. అట్టి యెడల క్వాచిత్కము లగుటం దెలఁపించుచున్నాఁడు 'ఒక్కొకచో' నని. సురవరులు వేల్పులు అమరులను నామంబులే ఈ సూత్రోదాహృతమునం బరస్పరము పర్యాయత నందియున్నవి.

సూ. ౭౭. నామ తదేత ద్వ్యక్త్యర్థంబులకుం బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యంత మయి పూర్వపదంబులుగ నాత్మార్థం బభిహితంబగు.

ఉ. 'తావచ్చె సుదర్శనాయుధుఁడు.' భాగ. ౧౦ స్కం. పూ. 'క. విదురుఁ డురు విహగ్నుల వలనన్, మానుగ నేమఱకుం డని, తాను బ్రబోధించె.' భార. ఆది. ౬ ఆ. (ఇటఁ దాశబ్దము పాదపూరణార్థకము. 'వచ్చె సుదర్శనాయుధుఁడు.' విదురుఁడు బోధించె' అని యాత్మార్థ విరహితంబుగను జెప్పనగు) 'ఆ. అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిగి గా, కన్నె యిట్లు సే యనువిదకడఁగె.' భార. ఆర. ౨ ఆ. 'వ. అదియును దన కమ్మను జేశ్వరుం డపాయంబు సేయున కాఁ దలఁచి' భార. ఆర. ౨ ఆ. 'క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు కీడు నిచ్చుఁ గర్తలు దనకున్, గర్మములు బ్రహ్మకైనను, గర్మతుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్.' భాగ. ౧౦. స్కం. పూ. మొ.

వ్యా. నామమునకును తదేత ద్వ్యక్త్యర్థంబులకుఁ బునర్గ్రహణము గల్గునప్పుడు వానికిం బర్యాయముగ ప్రథమాది విభక్త్యంతమై ముందో వెనుకనో ఆత్మార్థము ప్రయోగింపఁబడును. 'తా వచ్చె సుదర్శనాయుధుఁడు' 'అడవిఁ దన్నుఁబాసి యరిగిన నలిగి గా, కన్నె యిట్లు సేయ నువిదకడఁగె' 'కర్తలు దనకున్, గర్మములు బ్రహ్మకైనను—అను

ముదాహరణంబులం దాత్మార్థము పూర్వంబుగను ఇతరములం బరముగను నభిహితమై యుండుట నరయునది.

సూ. ౭౮. ఆత్మార్థం బొకానొకచో నామాస్మదర్థాభిధాయియు నగు.

ఉ. 'తే. తనకు మఱి తానె చుట్టంబు తానె తనకు, గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనఁగా, వనజనేత్ర గాంధర్వవివాహ మతిరహస్యమును నమంత్రకమును నగుచు నొప్పు.' 'తనకున్—స్త్రీకనుట) భార. ఆది. ౪ ఆ. 'క. తనతొంటి కర్మరాశికి, ననుచరమై బహువికారమై మనము వడిన్, జను నింద్రియముల తెరువులఁ, దనువులు పెక్కైనఁ జెడవు తనకర్మంబుల్.' భాగ. ౧౦ స్కం. పూ. (తన = ప్రాణియొక్క) మొ. 'తన కిష్టుఁడున్ సహాధ్యాయుఁడు నైనవాఁడు.' (తనకు=నాకు) భార. ఆది. ౧ ఆ. 'తన తనుచ్ఛాయ మస్తకహీనమై తోఁచె' (తన తనుచ్ఛాయ=నా తనుచ్ఛాయ) జై. ౩ ఆ. 'నీవు చెప్ప నొడికంబుగఁ బూనిన యీ ప్రబంధమున్ దన కిపు డంకితంబు ప్రమదంబుగఁ జేయుము.' (తనకున్=నాకు) రుక్మాం. ౧ ఆ. 'సీ. తమ సొమ్ము తమ కిచ్చె ధర్మరాజని మహీ, సురులు దానముసేయఁజూచి నగరె.' (తమ సొమ్ము=మాసొమ్మె, తమకున్=మాకు.) జై. ౧ ఆ. మొ.

వ్యా. ఒకానొకచో ననఁగా ప్రయోగములం గ్వాచిత్కముగ నని యర్థము. ఆత్మార్థం బనఁగా తాను శబ్దమును, దాని వివిధరూపములును. ఇవి నామర్థంబునం గొన్నియెడలను అస్మచ్ఛబ్దార్థమునం గొన్నియెడలను గాననగుచున్నవని సూత్రార్థము. ఉదాహృతములం దొలిరెండును నామార్థంబున కనియుం మఱి నాలుగు నస్మదర్థంబున కనియుఁ గ్రాహ్యము.

సూ. ౭౯. కర్తృబహుత్వంబునఁ దన తనకుఁ దమ తమయు నగు.

ఉ. 'క. తమతమ పుత్త్రుఁడుగాఁ జిత్తములం జేకొని దయను పృథగ్భావము లేక ముదంబునఁ బెంచిరి.' భార. అర. ౩ ఆ. మొ.

వ్యా. సూత్రమందలి సముచ్చయార్థకముచేఁ 'దన తన'యుం, 'తమ తమ'యు నుభయత్రబును గ్రాహ్యమే.

సూ. ౮౦. ఒక్కొకశబ్దంబుల యత్వంబున కొత్వంబు విభాషనగు.

ఉ. ఒక్కఁడు, ఒక్కొఁడు; ఒకఁడు, ఒకొఁడు.

వ్యా. ఒక్కశబ్దమునం ద్విత్వ కకారము మీఁదిదియు ఒకశబ్దంబున కకారము మీఁదిదియు నగు 'అ'కార స్థానమున ఒకారము వైకల్పికముగ వచ్చును, కాఁగా 'నొక్కొక' శబ్దముల నొక్కొకదానికి రెండేసిరూపములు. ఉదాహరించుచున్నాఁడు 'ఒక్కఁ' డిత్యాది.

సూ. ౮౧. ఒక్కొకాదులకు డువర్ణకంబు పరంబగునపుడు మహదర్థంబున రురు వుగాగమంబులును, అవి పరంబగుచోఁ గకారమునకు లోపంబును, కకారాదులకు లోపంబగా డువర్ణకమునకు ద్విత్వయుక్త డువర్ణంబును, అమహదర్థంబునం గకారాదులకు లోపబిందువులును విభాష నగు.

ఉ. ఒక్కరుఁడు, ఒక్కొరుఁడు; ఒకరుఁడు, ఒకొరుఁడు; ఒక్కరువుఁడు, ఒక్కొరువుఁడు, ఒకరువుఁడు, ఒకొరువుఁడు, ఒరుఁడు, ఒరువుఁడు, ఒడ్డు, ఒండు.

వ్యా. ఒక్క—ఒక—మన్నగు శబ్దములకు ప్రథమైకవచన ప్రత్యయంబగు డువర్ణకంబు పరంబగునపుడు రురు వుగాగమంబులు. వైకల్పికముగ వచ్చును. కిత్త్వముచే నంతాగమములగ నని తెలియవలయును. కాఁగా ఒక్కరుఁడు ఒక్కొరుఁడు; ఒకరుఁడు ఒకొరుఁడు, ఒక్కరువుఁడు ఒక్కొరువుఁడు, ఒకరువుఁడు ఒకొరువుఁడు నను రూపములు ఏర్పడును. కానిపక్షమున ఒకఁడు ఒకొఁడు ఒక్కఁడు ఒక్కొఁడు అనియే యుండును. ఈ నాలుఁగింటికి గ్రాహ్యకముగనే సూత్రమున ఒక్కొకాదుల కనుచోట నాదిశబ్దము గ్రహింపఁబడినది. రురువుగాగమములు వచ్చునప్పుడు కకారమునకు లోపము వైకల్పికము. లోపించిన ఒరుఁడు ఒరువుఁడు లోపింపకున్న ఒకరుఁడు ఒకరువుఁ డిత్యాదిగా నుండును. కకారాదులకు లోపమువచ్చిన డువర్ణకము స్థానమున ద్విత్వ డువర్ణకము వైకల్పికముగ వచ్చును. వచ్చిన ఒడ్డు అనియు రాకున్న ఒరు డ్డిత్యాదిగను రూపసిద్ధి గ్రాహ్యము. ఇందనుక నుక్తరూపము లన్నియు మహదర్థమున

వని తెలియవలయును. అమహదర్థమున కకారాదులకు లోపమును తత్స్థానమున బిందువును వైకల్పికముగ వచ్చును. వచ్చిన ఒండు అనియు రాకున్న ఒకఁడు ఒకొం డిత్యాదిగను రూపము లేర్పడును.

సూ. ౮౬. టివర్ణంబ మహదర్థంబున నొక్కఁడాదుల డు వర్ణకంబునకు విభాషనగు.

ఒక్కటి ఒక్కొటి ఒకటి ఒకొటి.

వ్యా. అమహదర్థమున ఒకఁడు మున్నగువాని 'డు' స్థానమున టివర్ణంబు వైక ల్పికముగ వచ్చును. టివర్ణంబుతో నొకటియుఁ డువర్ణకముతో నొకటియుం గాన మహదర్థమునం ద్వైరూప్యము గల్గును. మహదర్థంబున నన్ననో డువర్ణకంబుతోడి దొక్కటేరూపము. సూత్రమును డువర్ణకం బనుటకన్న డుజ్ వర్ణకంబున కని యుండుట మేలు.

సూ. ౮౭. ఎక్కటి యొక్కటి (స్పష్టము.)

వ్యా. ఎక్కటి యనియు నొక్కటికి రూపాంతరము గలదు. 'వేడిమి యెల్ల నెక్కటియై యొదలెత్తె ననఁగ.' లక్ష్మీ. ౨ ఆ.

సూ. ౮౮. ఒకశబ్దం బొక్కచో నల్పార్థకంబగు.

ఉ. 'ఒక మున్నాఁడు గదల్చి తెచ్చిన లలాటప్రోద్గాత్రు చాపంబు' భాగ. ౯ స్కం. 'ఒక నూఱేడుల్' మార్క. ౫ ఆ. 'వి మొక కొండ అము.' విక్ర. ౫ ఆ. మొ.

వ్యా. ప్రయోగములం దటనట ఒకశబ్దము 'అల్ప' మను నర్థమునం గన్పట్టు చున్నది. ఉదాహరించుచున్నాఁడు: 'ఒక మున్నా' డిత్యాదిని. రెండ్వాదులకు నీ యర్థము కలదు. 'రెండుమాటలు విని పొమ్ము' మొ.

సూ. ౮౯. ఒకానొకచో ననిర్దిష్టార్థమం దొక శబ్దమునకుం బూర్వాగ మం బగు.

ఉ. ఒకానొకఁడు ఒకానొకతె ఒకానొకటి. ఒకానొకచో నను టచే ఒకఁడు ఒకతె ఒకటి. ఒకశబ్ద మొక్కాదులకు నుపలక్షణము.

వ్యా. నిర్దేశింపఁబడని యర్థమందు ఒకశబ్దమునకు 'ఒకా' నను పూర్వాగమము వచ్చుట గలదు. వచ్చిన ఒకానొకఁ డిత్యాదిరూపములు ఏర్పడును. ఈ పూర్వాగమ విధి నిత్యము కామిని 'ఒకానొకచో' ననుట తెలిపెడి సూత్రమం 'దొకశబ్దమున' కని యున్నను ఈకార్య మొకణ్ణాదులకుం గల్గును గానఁ జెప్పుచున్నాఁడు 'ఒకశబ్ద మొకణ్ణాదులకు నుపలక్షణము' అని.

సూ. ౮౬. సర్వనామంబులకు మహదర్థంబునం దఱచుగ లుల-లకు రుర-లగు.

ఉ. ఎల్లరు, ఎల్లరన్; వారు, వీరు, వేరు. మొ. తఱచుగ ననుటచే తాము, మేము; తమ్మున్, మమ్ము మిమ్మున్ ఇత్యాదిరూపంబులు నగునని యెఱుంగునది.

వ్యా. సర్వనామములకు మహదర్థమున లుల-లకు బదులు రుర-లు తఱచుగ వచ్చును. తఱచుగ నఁగా బహుళముగానని కొనవలసిన ట్లున్నది. ఈ రేఫాదేశము కొన్నియెడల నిత్యముగను కొన్నియెడల వైకల్పికముగను కొన్నియెడల రానివిగను ఇట్లు పెక్కురీతుల నున్నది. ఎల్లరు ఎల్లరన్ ఇత్యాదులలో రేఫాదేశము నిత్యము, తాము మేమ్వాదులలో నియ్యాదేశము రాదు. పెక్కుశబ్దమునకు మహదర్థంబున పెక్కురనియుం అమహదర్థంబున పెక్కులనియుం రూపములు.

సూ. ౮౭. ఏఁడే రే దేవి శబ్దంబు లర్థవిశేషంబునం దీకారాంతంబులగు.

ఉ. 'ఏఁడీ నా బలుమానికంబుల కొటారు.' అచ్చ. రా. అ. కాం. 'వారేరీ సిరిమూట కట్టుకొని పోవంజాలిరే.' భాగ. ౮ స్కం. 'ఏది యేదీ యిది చాలఁ గ్రొత్త.' కళా. ౧ ఆ. మొ. హ్రస్వాంతంబులు నగు. ఉ. వాఁడేడ, వారేరి. మొ. (అర్థవిశేషము: ఎక్కడ, ఎక్కడ నున్నాఁడు. ఇత్యాది.)

వ్యా. ఏఁడు, ఏరు, ఏది, ఏవి శబ్దములకు 'ఎక్కడ ఎక్కడనున్నాఁ' డను నర్థ విశేషము ప్రయోగములం గాననగుచున్నది. అయ్యర్థంబునం దా రూపంబులకు నంత్య దీర్ఘము కొన్నిపట్లం గన్పట్టుచును గొన్నిపట్ల లేకయుం నున్నదని సూత్రోదాహరణ ముల యర్థము.

సూ. ౮౮. అంతాదులకు వారు పరంబగుచో వాకు లోపంబును రుర-లకు ఉఱ లాదేశంబునగు.

ఉ. అందఱుఱ్, అందఱఱ్.

వ్యా. అంత+వారు అనియుండ వాలోపంబును రేఫంబునకు శకటరేఫాదేశంబును గలుగ అంత ఱు అనియుం దరువాతి సూత్రముచే తకారమునకు దకారము రాఁగా అందఱు అనియుం నేర్పడును. ఇట్లే అందఱఱ్ మొ.

సూ. ౮౯. వాలోపంబుతేఱి వాని తకారంబునకు దకారంబగు.

ఉ. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు.

వ్యా. అంతాదులకు పరంబగు వారు లోని వాకు లోపము పూర్వసూత్రోక్తము. అది లోపించునప్పుడు అంతాదులయొక్క తకారస్థానమున దకారము తప్పకవచ్చును. అందఱ్వాదులు ఉదాహృతులు.

సూ. ౯౦. ద్వితీయాదులం దసంయుక్త రవర్ణకంబు నత్వంబున కిత్వంబు తఱచుగనగు.

ఉ. వారిఱ్, వీరిఱ్, వేరిఱ్, ఒకరిఱ్, వాండ్రఱ్, వీండ్రఱ్, వేండ్రఱ్, ఒక్కండ్రఱ్. మొ. తఱచుగ ననుటచే ఇరువుర నిత్యాదులయం దిత్వంబు గలుగదు.

వ్యా. ద్వితీయాది విభక్తులు పరములైనప్పుడు అసంయుక్త రవర్ణకముయొక్క యత్వము పోయి యిత్వమువచ్చును. 'అసంయుక్త' యనుటచే 'వాండ్రఱ్' ఇత్యాదుల లోను 'రవర్ణకం' బనుటచే ౮౮ సూత్ర విహిత ఱు ఱ లకును ఇత్వప్రాప్తి లేదు. అందఱిఱ్ ఇత్యాదు లసాధువులు. ఇత్వంబు తఱచుగ నగునంటచే 'ఇరువుర' నిత్యాదు లగు కొన్నిపట్ల రవర్ణంబు నత్వంబున కిత్వప్రాప్తిలేమి గ్రామ్యమనుచున్నాఁడు.

సూ. ౯౧. రుర వర్ణకంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు.

ఉ. ఇరుగురు, మూగురు, నలుగురు, అయిదుగురు, ఏగురు, ఆఱుగురు, ఏడుగురు, వేగురు, పదుగురు, మొ. సాధారణంబుగ ననుటచే ఎనమండ్రు, తొమ్మండ్రు, ఇరువండ్రు, ముప్పండ్రు. ఇత్యాదులందు రాదని యెఱుంగునది.

వ్యా. మహదర్థంబున సర్వనామంబులకు లు ల లకు మాఱుగా రు ర లు వచ్చునని పూర్వోక్తము. రు ర లకు ముందు గు వర్ణము సాధారణముగవచ్చును ఉదా. ఇరుగురు మొ. సాధారణంబుగ ననుటచే గ్వాగమము రానియెడలు కొండొక గలవని చెప్పుచున్నాడు.

సూ. ౬౨. సంఖ్యావాచకంబులకు విభక్తి పరంబగునప్పుడు కొన్నింటి యంత్యాక్షరంబులకు లోపంబగు.

ఉ. మూగురు, నలుగురు, ఎనమండ్రు, తొమ్మండ్రు, ఇరువండ్రు, ముప్పండ్రు. మొ. అక్షరంబుల ననుటచే ఎనుబండ్రు లోనగువానియం దుపాంత్యవర్ణంబునకును లోపంబు. కొన్నిటియనుటచే అయిదుగురు, ఆఱుగురు ఇత్యాదులందు లోపంబులేదు.

వ్యా. సంఖ్యందెలుపు పదములకు రు ర లు పరంబులై గ్వాగమంబగునెడ నంత్యాక్షరముల లోపంబు కొన్నింటికగు. 'అక్షరంబు'లను బహువచనముచే గొన్నింటికి అంత్యాక్షరమును గొన్నింటికిం గడపటి రెండక్షరములును లోపించును. 'కొన్నింటి' కనుటకు ఈ లోపము సార్వత్రి కామి హేతువు. ఉదా. ఐదుగురు మొ.

సూ. ౬౩. రురవర్ణకంబులు పరంబులగునపుడు కొన్నిటికి నిత్యముగాను గొన్నిటికి వైకల్పికముగాను బిందుపూర్వక డకారంబు పూర్వాగమంబగు.

ఉ. ఎనమండ్రు, ఎనమండ్రక్; తొమ్మండ్రు, తొమ్మండ్రక్; ఇరువండ్రు, ఇరువండ్రక్, ముప్పండ్రు, ముప్పండ్రక్; నలువండ్రు, నలువండ్రక్, ఏబండ్రు, ఏబండ్రక్; ఆఱువండ్రు, అఱువండ్రక్; డెబ్బండ్రు, డెబ్బండ్రక్; ఎనుబండ్రు, ఎనుబండ్రక్, తొంబండ్రు,

తోంబండ్రన్. మొ. పెక్కండ్రు, పెక్కండ్రన్; పెక్కురు, పెక్కురన్; పదుండ్రు, పదుండ్రన్; పదురు, పదురన్; పదుగుండ్రు, పదుగుండ్రన్; పదుగురు, పదుగురన్; వాండ్రు, వాండ్రన్; వారు, వారిన్; మొ.

వ్యా. ఎనమండ్రిత్యాదుల నిత్యాగమంబు నిత్యమని పెక్కండ్రిత్యాదుల వైకల్పికమని ఆరసికొనవలెను.

సూ. ౯౪. బిందుపూర్వక డకారంబు పరంబగుచోఁ దుదియిత్వోత్వం బుల కత్వంబగు.

వ్యా. పూర్వసూత్రోక్త బిందుపూర్వక డకారము పరమగునపుడ ఎనిమిద్యాదుల యిత్వంబునకును పెక్కుర్వాదుల యుత్వంబునకును అత్వము వచ్చును. ఉదాహరణములం బూర్వసూత్రముక్రిందనే చూచుకొనునది యనుచున్నాఁడు 'ఉక్త' మనుటచే.

సూ. ౯౫. కొండొకయెడ ఋఌవర్ణకములు పరంబగునపుడును నత్వం బగు.

ఉ. చూపఋ, చూపఌన్, మొ.

వ్యా. రురవర్ణకంబులు పరంబులగునప్పుడు సూ. ౯3 లో విధింపఁబడిన యత్వమీ సూత్రంబున ఋ ఌ లు పరములగునప్పుడును విధింపఁబడుచున్నది.

సూ. ౯౬. పలుశబ్దంబునకు రురలు పరంబు లగునపుడు గు వర్ణంబును, వలయుచో మీఁద బిందుపూర్వక డకారంబును విభాషనగు

ఉ. పలుగురు, పలుగురన్; పలుగుండ్రు, పలుగుండ్రన్. మొ.

వ్యా. రు రలు పరములగునప్పుడు పలుశబ్దంబునకు గు వర్ణాగమము నిత్యముగ వచ్చును. పలుగురు పలుగురన్—ఇత్యాది. 'క్వచిద్ గకారోపి' అనుటచే పలువురు పలువురన్—ఇత్యాదులు రూపాంతరములు. గు వర్ణముమీఁద బిందుపూర్వక డకారంబు వైకల్పికముగ వచ్చును. వచ్చిన పలుగుండ్రిత్యాదిగను రాకున్న పలుగురిత్యాదిగను రూపము లేర్పడు.

సూ. ౯౭. ఇరు రెండున కాదేశంబగు. ఉ (ఉక్తము)

వ్యా. రు ఱులు పరములగునప్పుడు గ్వాగమము వచ్చుననుట పూర్వసూత్రముల నుండి యనువర్తింపఁగా రెండు+గు+రు అనియుండ నీ సూత్రముచే రెండునకు ఆదేశముగా 'ఇరు' రాఁగా ఇరుగురు ఇరుగురన్ అనియుం 'క్వచిద్ గకారో వః' అనుటంబట్టి ఇరువురు ఇరువురన్—ఇత్యాదిగను రూపము లేర్పడును.

సూ. ౯౮. ఒకానొకచో నిరుగురున కిద్ద ఱాదేశంబగు.

వ్యా. ఇరుగురు ఇరువురు ననువాని కిట ఇద్దఱను రూపాంతరము చెప్పఁబడినది. ఒకానొకచో ననుట క్వాచిత్కతా ద్యోతనార్థము.

సూ. ౯౯. విభక్తి పరంబగుచో మూఁడు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగ నగు.

ఉ. ముగురు (శేషముక్తము)

వ్యా. శేష మనఁగా గ్వాగమమును నలుగురు మున్నగు నుదాహరణాంతరములు.

సూ. ౧౦౦. ప్రాప్తహ్రస్వంబులగు మూఁడేల మీఁది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగ నగు. ఉ (ఉక్తము.)

వ్యా. మూఁడు శబ్దముమీఁదను ఏ శబ్దముమీఁదను ద్విత్వమువచ్చునని యర్థము ముగ్గురు, ఎవ్వరు. బాహుళకముచే 'నలుగురు'లో ద్విత్వము రాదు.

సూ. ౧౦౧. ఎనిమిదిని వర్ణంబున కత్వంబగు ఉ. (ఉక్తము.)

వ్యా. ఎనిమిది ని వర్ణమున కత్వమువచ్చుట ఎనమండ్రులో గానగు. 'ఎనుబండ్రులో' ఉత్వము.

సూ. ౧౦౨. పది యిత్వంబున కుత్వంబగు. ఉ. (ఉక్తము)

వ్యా. పది యిత్వంబునకు ఉత్వ మాదేశమగును. ఎప్పుడనుటకు విభక్తిపరంబగు నపుడను జవాబును సూ ౯౯ నుండి యనువర్తింపఁజేసికొనవలెను. పదుగు రను నుదాహరణమును సూ ౯౧ క్రిందఁ జూచుకొనునది.

సూ. ౧౦౩. కొన్నియెడల నవకగు కానంబడియెడి.

ఉ. 'క. వినవే డగు పర్వము మే, లనఁగా ద్రోణాభిషేక మాదిగఁ గల య, య్యెనిమిది పర్వములను న, త్యనుపమమై ద్రోణపర్వ మమరుఁ సభలన్' భార. ఆది. ౧ ఆ. 'క. అనుపమ బలులగు కర్ణా, ర్జున వీరుల శౌర్య మహిమ శోభిల్లంగా, నెనిమిదియగు పర్వంబిది, యనఁ బరఁగుఁ గర్ణపర్వ మతిహృద్యంబై.' భార. ఆది. ౧ ఆ. 'చ. పదియగు వేయి నిండుటయుఁ బార్త్తిముఖుండు మనంబునన్ ముదం, బొదవఁగ నిర్వికారమున నున్న శిరంబును గోయఁజూచినన్.' నిర్వ. ౩ ఆ. (ఇట్టి యెడల అవ యనియే యుండవచ్చును. అయినను గ్రంథములయందుఁ బాఠ మిట్లగపడుచున్నది.)

వ్యా. పూరణార్థమున నవగాగమము రాకపోవచ్చుననియుం ఆఁగు అనునది ప్రయోగింపవచ్చుననియుం నీ భారతప్రయోగములు చెప్పుచున్నవి. అగు ననునది యతి ప్రాసస్థానములం దుండకుండుటచే 'అవ' యని మార్చ వీలున్నను ప్రాచీనగ్రంథము లందలి పాఠము మార్చుట న్యాయముగాదని యిట్లు సూచించియున్నాఁడు. ఇట్టి వానిని మార్చ సాహసించికొంబోలు సూరి. బా. ఆచ్ఛి సూ. ౨౫ లో 'సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు' నని నిత్యముగా విధించెను.

సూ. ౧౦౪. మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్నియెడల న మహాత్మార్యంబు చూపట్టెడి.

ఉ. 'వ. ఇందుఁ బౌలోమ కాలకేయులను నసురు లఱువదివే లుండురు.' భార. అర. ౪ ఆ. 'సీ. జనవంద్యుఁ డగు ధర్మతనయుని బంతి నిత్యంబు పసిఁడి, పళ్లెరంబులఁ గుడుచు బ్రాహ్మణు లతి పుణ్యు లెనిమిది వేలు సమిద్ధమతులు, యతులు పదివేలు వారల కనుదినంబు, నన్నపానంబు లందు సహాయ నగుదు.' భార. అర. ౫ ఆ. 'ఎ. కనక భూషణాలంకృతు లయిన పరిచారకులు నూఱువేలు.' భార. అర. ౫ ఆ. 'సీ. వారాకరంబులో వటపత్రశయను లౌ నబ్జనాభులు నూఱు నైదు పదులు.' కాశీ. ౬ ఆ 'సీ. మూఁ డర్బుదములు సముద్యద్భుజాటోప

విజయఘోరేయులు వీరభటులు.' జై. ౫ ఆ. "వేడి వెలుంగు లోలిఁ బది వేల సహస్రము లున్న భంగి సూర్యుఁడు వెలుంగు నట్టి బుధవత్సలుఁ డేఁగె సదృశ్యమూర్తియై.' భోజ. ౪ ఆ. (కొన్నియెడల ననుటచే పది వేవురు, నూఱు నేఁబండ్రు (లేక) నూఁట యేఁబండ్రు అని యిట్లు మహత్ ప్రయుక్తరూపంబులుం గలవని యెఱుంగవలయును. కడపటి యుదాహరణములయందలి సంఖ్యావాచకములు తత్సమములు గాన వాని కట్టిరూపములు మూఁడర్బుదముల సంఖ్యలవారు, పదివేల సహస్రముల సంఖ్యలవారు అని యేర్పడుచున్నవి.

వ్యా. 'అసురులు...ఆఱువదివేలు' 'బ్రాహ్మణులు...ఎనిమిదివేలు' 'యతులు... పదివేలు.' 'పరిచారకులు...నూఱు వేలు' 'అబ్జనాభులు నూఱు నైదుపదులు.' 'వీరభటులు మూఁడర్బుదములు'—వీనిలో విశేష్యములు మహద్వాచకములయ్యు వాని విశేషణములు అమహత్కార్యయుంతంబులై యున్నవి. ఏఁబండ్రు నూఁట యేఁబండ్రు అని యిట్లు మహత్ప్రయుక్తరూపంబులుం గలవు కాన పూర్వంబుల విశేషరూపము లుగఁ గొనుట యొప్పును.

సూ. ౧౦౫. ఔపవిభక్తికాంతంబులగు చేయి నేయి లోనగు శబ్దంబుల యాద్యచ్చునకు హ్రస్వంబును మీఁది హల్లునకు ద్విత్వంబును ప్రథమైకవచనంబునందు వైకల్పికంబుగ నగు.

ఉ. చేయి, చెయి, చెయ్యి; నేయి, నెయి, నెయ్యి; మొ. ఇతర స్థలంబులయందు, ఉ. చేతితోఁ జేతికిఁ నేతితోఁ, నేతికిఁ మొ.

వ్యా. ఇందలి హ్రస్వద్విత్వములను సన్నియోగశిష్టములుగ విధించుటచే రెండు కార్యములకును యుగపత్ప్రవృత్తి స్ఫురించును గావున "చేయి" అను శబ్దముయొక్క సాధుత్వము సందిగ్ధముగ నుండును. కావున హ్రస్వము వైకల్పికమనియును, దాని భావాభావపక్షములందు ద్విత్వము వైకల్పికమనియు సమన్వయించుకొనవలయును. ఈ సమన్వయమున దీర్ఘపక్షమున ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు అచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు' నను బాల. సమా. సూ 13 చే హ్రస్వమువచ్చును గాన చేయి చెయి చెయ్యి యను రూపత్రయమును సరసముగా సిద్ధించును.

సూ. ౧౦౬. ఊరు చోటు మున్నాదులు లుగ్విషయంబులు.

ఊరు లోనగువానికిఁ దృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాన 'ఔపవిభక్తిక నామ్నామత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' అను సూత్రమున కవి విషయములుగాక 'కేషాంచి దుదంతానాం నేతివిభక్తౌ పునోలుక్ స్యాత్' తను సూత్రమునకు విషయంబు లగుచున్నవని యెఱుంగ వలయును.

వ్యా. చింతామణిలో 'ఔపవిభక్తిక నామ్నామత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' యను సూత్రముచే గొడ్డటన్ గోరన్ ఇత్యాది తృతీయా సప్తమ్యర్థములుగల యన్నంతములను సామాన్యముగ సాధించి ఊరన్ చోటన్ ఇత్యాదులలోఁ దృతీయార్థ స్ఫురణము లేక ఊరియందు చోటునందు మున్నగురీతిని సప్తమ్యర్థస్ఫురణమే సుప్రసిద్ధమై యుండుటచే 'కేషాంచి దుదంతానాం నేతి విభక్తౌ పునో లుక్ స్యాత్' అను విశేషసూత్రమునకు లక్ష్యములుగా సాధించి తృతీయార్థకత నచ్చట వారించి యున్నాఁడు. చిన్నయసూరి యన్నంతముల నన్నింటిని 'ఔప విభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' నను ఆచ్ఛిక. సూ. ౩౮ కి లక్ష్యములుగఁ జేసినాఁడు. ఊరన్—ఇత్యాదులకుఁ దృతీయార్థకతను సూరి వారింపయత్నింపఁ డాయెనని యెంచి ప్రౌఢవ్యాకరణకారుఁడు ఈ విషయమునఁ జింతామణి మార్గమే సమంజస మని బోధించుచున్నాఁడు. కాని సూరి సూత్రమందలి 'బహుళంబుగా' ననుట వలననే ఊర నిత్యాదులకుం దృతీయార్థకత లేమి యాదిగాఁగల నానాప్రకారముల కును గ్రహణము గలదని ఎంచఁదగును.

సూ. ౧౦౭. సద్రుతం బంతశబ్దంబు తన తమ పూర్వకంబు స్వాయమర్థకం బగు.

ఉ. తనయంత, తనంత; తమయంత, తమంత; 'చ. వనిత దనంతఁ దా వలచివచ్చినఁ బుల్కనగాదె యేరికిన్.' స్వా. 3 ఆ. ము.

వ్యా. తన తమ శబ్దముల నంటివచ్చు నంతశబ్దము సద్రుతం బైనప్పుడు తమం తటతానే తము తట తామే యను నర్థమువచ్చును. సద్రుతముకాకున్న పరిమాణాదులం దన లేక తమపాటి యను నర్థముగల్గును.

సూ. ౧౦౮. షష్ఠ్యంత తదేత ద్యుష్మదస్మదాత్మ శబ్దపూర్వకంబులగు ప్రథమాంత తవాది శబ్దంబు లవధారణార్థకాంతంబులు తఱచుగ స్వాయమర్థకంబు లగు.

ఉ. వానికి వాఁడె, వీనికి వీఁడె, నీకు నీవె, నాకు నేనె; తనకుఁ దానె, వారికి వారె. మొ. తఱచుగ ననుటచే తను దాన, తారు దారె ఇత్యాదులు గ్రాహ్యములు. 'సీ. పొరలెత్తి ఘనసార కరువులఁ దనుదాన తొరఁగిన పచ్చకప్పురపు రజము.' స్వా. ౨. ఆ. 'తను దా నాపూర్ణ ప్రభల వెలయుఁ.' పర. ౧ ఆ. మొ.

వ్యా. ప్రథమాంత తదాదిశబ్దంబు లన్నిచోట ఆదిశబ్దముచే నేత ద్యుష్మదస్మదాత్మశబ్దములే గ్రాహ్యము లగును. ప్రథమావధారణాంతకాంత తదాది శబ్దములు షష్ఠ్యంత తదాది శబ్దపూర్వకములయ్యె తఱచుగ స్వాయమర్థ మిచ్చును. అట్లు కాకయుం వయ్యర్థమిచ్చు 'తను దాన తాకు తాఁకే' ఇత్యాదిరూపంబులుం గొండొక కలవు.

సూ. ౧౦౯. కొన్నియెడల షష్ఠ్యంత తవాది శబ్దపూర్వకంబులు గాకయు నవి స్వాయమర్థకంబు లగు.

ఉ. వాఁడే వచ్చెను—వాఁడు తనంత వచ్చెననుట—ఇత్యాదు లెఱుంగునది.

వ్యా. అవి యనఁగా ప్రథమావధారణార్థ కాంతంబులగు తదాదిశబ్దములు, షష్ఠ్యంత తదాదిశబ్దములు లేకుండఁగనే 'తనంత' నను నర్థమిచ్చుననుట కుదాహరణము వాఁడే వచ్చెను. మొ.

సూ. ౧౧౦. షష్ఠ్యంత తదేత ద్యుష్మదస్మదాత్మ శబ్దపూర్వకం బంతట శబ్దంబు పృథగర్థకం బగు.

ఉ. వానియంతట వాఁ డున్నాఁడు మొ.

వ్యా. ఇటఁ బృథ గర్థకత్వమేకాక స్వాయమర్థకత్వముగూడ గనపడుచున్నది. 'ఇతర సాహాయ్యా నపేక్షముగానున్నాఁ' డనుట.

సూ. ౧౧౧. ఆదరార్థంబునం ద్విరుక్తియగు.

ఉ. కృష్ణకృష్ణ, హరిహరి మొ.

వ్యా. ఏయే యర్థములందు శబ్దములు ద్విరుక్తములగునో నాలుగుసూత్రములచేఁ దెలుపువాఁడై ఇందు ఆదరార్థంబునందు శబ్దములకు ద్విరుక్తి గల్గుననుచున్నాఁడు. కృష్ణ కృష్ణ హరిహరి యనుటచే కృష్ణహరులయందలి యాదరాతిశయము గ్రాహ్యమనుట.

సూ. ౧౧౨. అత్యంతార్థంబునందు నగు.

ఉ. ఔరౌర, కటకటా, మొ. కనికని, వినివిని మొ. 'తద్గుణౌఘముల్ వినివిని, కళా. ౭ ఆ. మొ.

వ్యా. ద్విరుక్తియనుట పూర్వసూత్రమునుండి యనువర్తించును—అత్యంతార్థంబునందును మిక్కిలి యను నర్థమందును ద్విరుక్తి వచ్చుననుట. ఔరౌర కటకటా యనుట లచే నాశ్చర్యసంతాపముల యౌత్కట్యము గ్రాహ్యము. కనికని వినివిని యన్నప్పుడు మిక్కిలి కని మిక్కిలి విని యని యర్థము.

సూ. ౧౧౩. కొన్నియెడలం ద్వరితానాదరార్థంబుల రెంటను నగు

ఉ. లే లెమ్ము, పో పొమ్ము. మొ.

త్వరితార్థమనం ద్వరపెట్టు నర్థము. అనాదరార్థ మనఁగా నసాదరించు నర్థము. లే లెమ్ము—ఇట ద్విరుక్తి త్వరితార్థకము. పో పొమ్ము—ఇట ద్విరుక్తి త్వరితార్థకమేని అనాదరార్థకమేని కావచ్చును.

సూ. ౧౧౪. కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబులయి యదంతంబులు నగు.

ఉ. ఒండొండ, తరతరమ. (ఇట నర్థవిశేషము క్రమముగా ననుట.

వ్యా. కొన్నిశబ్దములు ద్విరుక్తము లగుటయేకాక యదంతములుకూడ నగును. అప్పుడు వానికి అద్విరుక్తములైయున్నప్పటి సామాన్యార్థమును కాక విశేషార్థము

వచ్చును. ఒండు శబ్దమున కద్వీరుక్తమున కొకట యనియు నన్యమనియు నర్థములు. తర శబ్దమునకు నద్వీరుక్తమునకు పురుషాంతరాదు లర్థములు. ద్వీరుక్తములై యవం తము లైనప్పుడు క్రమముగా నను విశేషార్థము గల్గుచున్నది.

సూ. ౧౧౫. నామపదంబు లార్యాద్యర్థపరకంబు లయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబు లగు.

ఉ. 'అ. నన్ను సేకార్థసమవేతుఁ, బాడి యయ్యె యిట్టి పనికిఁ బనుప, భార. అర. ౨ ఆ. 'అర్హమయ్యె.' ఉ. హరి. ౭ ఆ. మొ.

వ్యా. 'పాడియయ్యె' అర్హమయ్యె' అనఁగా 'పాడికాదు' 'అర్హముకా' దను వ్యతిరేకార్థము తెలియఁబడుచున్నదనుట.

సూ. ౧౧౬. నామ సర్వనామంబులకును గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థ విశేష పాదపూరణంబులయందును శబ్దంబు తెఱచుగనగు. కళలగు ననుదంతశబ్దంబులమీఁద నయ్యది యువర్ణపూర్వకంబుగ విభాషనగు. మఱియు నది శేష షష్ఠియందు యొక్క లోపించినపుడు లాగమాంత బహువచ నంబుమీఁదను సముచ్చయమునం జూపఁబడు.

లాగమాంత మనుట మీమాది పర్యుదాసార్థమని గ్రహించునది.

ఉ. (౧) సముచ్చయమునందు నామపదములకు:—అన్నయుం దమ్ముండును, సతియుం బతియును, వాఁడును వీఁడును, చిన్నెయును వన్నెయును, నన్నును నిన్నును, తనచేతను మనచేతను, భూరి దక్షిణ మహాక్రతువులయం, మొ. అవ్యయములకు—చెప్పకయుఁ జూపకయుం, ఏసియుం బ్రేసియుం. మొ. (౨) అర్థవిశేషమందు నామపదములకు— 'చ. మెం,పున జమదగ్ని సూనుఁడును బోలఁడు నిన్నని విందు వింటి న్నేర్పున.' భార. అది. ౫ ఆ. 'శా. బాసనమునం దిచ్చోటనే కాదు న, న్నేపీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డేభంగులం జూచినన్.'

భార. విరా. ౧ ఆ. 'క. తనపూర్వ తపఃస్థానం, బని యనురాగమున బదరిసంతయుం జూడన్, మనమునఁ దలపోసి యొకం,డును మధ్యేరాత్రమునఁ గడుం గుతుకమునన్. వ. అచ్చోటి వసియింపం జని.' హరి. ఉ. ౬ ఆ. 'క. ధీర మతు లిట్లు చేసిన, వా రెవ్వరుఁ గలరె.' భార. ఆది. ౨ ఆ. 'ఎంతయుం దనరుఁ జటుక్య మన్మథుండు.' భార. ఆది. ౧ ఆ. 'అనుటయుఁ బిన్న నవ్వనగి.' భార. ఉద్యో. 3 ఆ. 'మెఱుఁగల విలాస విభ్రమ లక్ష్మిల్, దక్కుటయును నొక యొఱపై, నెక్కొన.' స్వా. ౪ ఆ. మొ. అవ్యయములకు:—సీ. అమృతాశనంబు సేయకయును దేవ నాకజరామరత్వంబు నందుటయును.' భార. ఆది. ౮ ఆ. 'క. పంక్తికంధరు నెట్లుం, జంపఁగఁ జాలక దోషము, పెంపునఁ గారాగృహమునఁ బెట్టఁగఁ బంచెన్.' నిర్వ. ౨ ఆ. 'క. వాటు వడి మూర్ఛ వోయిం, బోటరి దైత్యుండు దెలిసి.' ఉ. హరి. ౪ ఆ. మొ. (3) పాదపూరణమునందు నామపదములకు—'అందఱున్ వివశులై' భార. ఆది. ౬ ఆ. 'రేయిపగలు నిద్రయుం నెప్పుడెఱుఁగక.' భార. ఆది. ౧ ఆ. 'ఇ వ్వీరుల కగు సభీష్ట మిదియుం మొదలుగాన్.' భార. ఆది. ౨ ఆ. 'భాసిలుఁ దత్పురి కోట మిక్కిలిన్ మహిమను.' కళా. ౧ ఆ. 'ఎ, గీ. మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు' స్వా. ౮ ఆ. 'విపంచి నిన్న మొదలున్ నీవంటమిం జేసి.' స్వా. 3 ఆ. 'ఇ మ్మహి కార్యమునం జరింతు మెపుడున్.' స్వా. ౮ ఆ. ఇట్లు అంతయుం, పెద్దయుం, తద్దయుం. మొ. అవ్యయములకు—'ఆధారము లేకను.' (లేకను=లేకయును) భార. ఆది. ౮ ఆ. 'గోఱడకం దిగిచి.' (దోఱడకన్=దోఱడకయును) భార. ఆది. ౪ ఆ. 'ఎ. గీ. అనిలుఁ డను దూత వోయి తోడ్కొనియుఁ దెచ్చె'. భార. ఆది. 3 ఆ. 'సీ. కమలాప్తుఁ డుదయింపకయుం మున్న బుటుకున మునుఁగు సంగమతీర్థమునకు నేఁగి.' పాండు. ౬ ఆ. 'క. ఏ నొకటి విన్నవించెద, దానవకులమదన పెద్దతడవున నుండిం, బూని కనిపింపఁగల ఒని.' ఉ. హరి. ౬ ఆ. మొ. తలచుగ ననుటచే, ను శబ్దము కొన్నిటి కొకప్పుడు వచ్చును, ఒకప్పుడు రాదని యర్థము గ్రహింపవలెను. దీని కుదాహరణములు పాదపూరణము

సందళివి. విభాష నగుటచే ను శబ్దము కొన్నియెడల యువర్ణపూర్వకము గానే వచ్చుననియు, కొన్నియెడల యుపర్ణపూర్వకమయ్యును గాకయు వచ్చుననియు నర్థము పరిగ్రహింపవలయును. యుపర్ణపూర్వకముగానే వచ్చుటకు—ఉ. అనుటయు. మొ. యువర్ణపూర్వకమయ్యును గాకయు వచ్చుటకు—ఉ. 'సీ. ఎంతయు సంయమవంతుఁడు సహదేవుఁ డధ్యాత్మ విద్యా నారాధ్యుఁ డెంత ననఘుండు ధౌమ్యుండు.' భార. సభా. ౨ ఆ. 'ఎ, గీ. తమ్మికొలను ప్రవేశించు తలిరుఁబోండ్ల, విలసనము లెంత నెంతయు వింత లయ్యె.' కళా. ౬ ఆ. 'రగడ. చేటునకె యగుఁ జూలుచేఁ గలుగు మే లెంత.' స్వా. ౩ ఆ. 'క. ఒక గృధ్ర మెంతఁ బ్రియమున, నొక చర్మముఁ గఱచికొనుచు నుడుపథమున రా.' భోజ. ౪ ఆ. 'తే. అమరులెల్లను జల్లిరి సుమము లెంత.' అధ్యా. బాల. కాం. 'సీ. నిడుపునఁ దూర్పును బడమరనై రెండు కడల నంభోనిధిఁ గదిసి యుండు.' భార. భీష్మ. ౧ ఆ. 'లేఁజిగురుఁ గొమ్మం జేపగాకుండునే.' (కొమ్మన్=కొమ్మయును.) వసు. ౩ ఆ. 'పురారిం జేరలేఁడు' (పురారిన్=పురారియును.) ఉ. హరి. ౬ ఆ. 'తప మిట్టిదిం గలదె.' (ఇట్టిదిన్ = ఇట్టిదియును) నిర్వ. ౫ ఆ. 'నీవేమిని కగిరపడక.' (ఏమిని=ఏమియును) హరి. పూ. ౮ ఆ. 'అల భీమ నాథునకు నప్పటియుం బ్రణమిల్లి.' రుక్మాం. ౧ ఆ. 'చ. వెట్టిదిదె రోఁకలి దలఁజుట్టుమన్న క్రియగా నొక కొందఱు దాల్తురప్పటిన్, గలుమపథప్రవర్తనయె.' కళా. ౨ ఆ. 'ఉ. ఓట యొకింత యేనియుం సుయోధను చిత్తమునందు లేదు.' భార. ఉద్యో. ౪ ఆ. 'క. అమరఁగ జూదంబు నీకు నభిమతమేనిన్.' భార. అర. ౨ ఆ. 'మఱిం, దెనుఁగుం గుబ్బము లెన్నియేనియును.' (మొదటి రూపము మఱియును.' ప్రభా. ౧ ఆ. 'ముక్తుండు వెండిన్ విపులఁ బొడమనీ.' (మొ. రూ. వెండియును,) పాండు. ౩ ఆ. మొ.

వ్యా. నామములకును సర్వనామములకును కళలగు నవ్యయములకును కడపల నువర్ణమును బహుళముగ నీసూత్రముచే విధించుచున్నాఁడు. ఏ యర్థములం దనఁగా—సముచ్చయార్థమందును ఏదే నొకవి శేషార్థమునందును, ఏ యర్థమును లేక పాదపూరణ

ణముకై యుఁ. 'మున్ను ముచ్చిచ్చును అనుచోట ను శబ్దమునకు అపర్థకత యగపడు చున్నది. కావునం దాని పాదపూరణార్థ నువర్ణయుఁతముల నడిమినుండి యెడలించి అర్థవిశేషార్థ నువర్ణయుఁతములలోఁ జేర్చుట మేలు. శేషషష్ఠియందు యొక్క లోపించి నపుడు లాగమాంత బహువచనంబుమీఁద సముచ్చయార్థమున నువర్ణము చూపట్టెడు ననుటకు ఉదా. రెండు కడల సంభోనిధిఁ గదిసియుండు.' 'లాగమాంతమనుట మీమాది పర్యుదాసార్థ' మనుచున్నాఁడు మీమాఘటిత షష్ఠీసమాసములలో ఈ నువర్ణప్రాప్తి లేదని యర్థము.

ఇది బాలబోధసుధాపరనామ కుమారదేవపండితీయ మను
ప్రౌఢవ్యాకరణ వివరణమునందు
శబ్దపరిచ్ఛేదము.



# కారకపరిచ్ఛేదము

---

## సూ. ౧. కారకంబు లనం గర్త్రాదులు.

అవి యాఱు—కర్మకారకము, కర్తృకారకము, కరణకారకము, సంప్రదానకారకము, అపాదానకారకము, అధికరణకారకము. క్రియాన్వయమును గలిగించునది, అనఁగాఁ గ్రియాన్వయము కలదియని కారక శబ్దార్థము.

వ్యా. కారకశబ్దమును వివరించుచున్నాఁడు 'క్రియాన్వయమును గలిగించునది,' అనియుఁ 'క్రియాన్వయము కలది' అనియుఁ పేర్కొనుచున్నాఁడు కారకముల వాఱింటిని 'కర్మకారక' మిత్యాది. ధాత్వర్థ ఫలాశ్రయము కర్మము. ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణము. త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు. అపాదానం బనఁగా ఔపశ్లేషిక వైషయికాభి వ్యాపకంబులని త్రివిధంబులగు నాధారము.

## సూ. ౨. ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱించియు ననుప్రయుక్తంబగు.

ఉ. 'క. మము గుఱిచి సామగోత్ర, క్రమమున నీూర్చ్చ సేయఁగా.' హరి. పూ. ౨ ఆ. సముచ్చయగ్రహణము కూర్చి జ్ఞాపనార్థము.

వ్యా. చింతామణిలో 'కూర్చి, లన్ను, నయోభవేద్ ద్వితీయాతు కర్మప్రవచనీయకే కూర్చి' అని కూర్చి విభక్తి విధింపఁబడియున్నది. కాని దానికిఁ బూర్వము నగాగమము విధింపఁబడియుండలేదు. 'నేలఁగూలె మ్రాను...గుఱిచి' (శల్యపర్వము) ఇత్యాది భారతప్రయోగములలో గుఱిచి యనునదికూడఁ బ్రత్యయముగా నగపడుచున్నది. ఈ రెండంశములను బూరించుటకై యీ సూత్ర మారంభింపఁబడినది. 'అన విని...గుఱించి' (శల్యపర్వము) అను భారతోదాహరణమందును 'పటిగుఱించి పల్కు—' 'కర్మమును గుఱించి యాచించు గర్హితునకు' ఇత్యాది పాండురంగమాహాత్మ్యాదులలోని ప్రయోగములందును గుఱించి యను ప్రత్యయాంతర మగపడుచున్నది. ఇవి కూర్చ

గుఱించు ధాతువుల క్త్వాంతరూపము లనుట స్పష్టమేకాన వీనిం బృథక్పదములుగ భావించి కాంబోలును సూరి ప్రత్యయములలో వీనిని స్మరింపలేదు.

సూ. 3. అయ్యది వ్యవహితంబు నగు.

ఉ. 'సీ. అబ్జాసనుఁడు తన్ను నర్తితో గుఱిచి యజించుటగోరి సృజించె సురల.' హరి. పూ. ౧ ఆ.

వ్యా. గుఱిచి, ద్వితీయాంతమున కనుప్రయుక్త మగునని పూర్వసూత్రము. దానికి ముందటి ద్వితీయాంతములో వ్యవధానంబును ప్రయోగములం గానగు నని ఈ సూత్రము. ఉదాహృతమున తన్నను ద్వితీయాంతమునకును 'గుఱిచి'కిని 'నర్తితో' ననుపదమువలన వ్యవధానము నగసికొనవలెను.

సూ. ౪. కొన్నియెడలఁ జేత విభక్త్యర్థక వర్ణకంబులకును వేఱ వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు.

ఉ. 'నిశవిప్రసంబోధనఁ జేసి.' భార. ఆది. ౧ ఆ. 'అభీష్ట వరంబు లిచ్చుటం జేసి.' భార. అర. ౨ ఆ. 'అసవ్యా విహాగ్ర ధూమకేతనహతిఁ జేసి.' ఆది. ౧ ఆ. 'బహు వేదఘోషములఁ జేసి.' భార. అర. ౧ ఆ. 'సంప్రయోగమునఁ జేసి' 'దీనను జేసి' భార. సభా. ౧ ఆ. 'తే. ఇందఱును నిన్నిభంగుల నిడుమ కుడువ, వలసె ధర్మతనూభవువలనఁ జేసి.' భార. విరా. ౨ ఆ. తఱచుగ ననుటచే నొకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మయ్యెడు నని తెలియవలయు. ఈ యర్థమునకు 'షేతరత్ర చ ద్వితీయా.' అను స్థాననియమశూన్యవిధియుం నవకాశమిచ్చుచున్నది. ఉ. 'ఎ, గీ. తండ్రి పనుపుఁ, జేసి మునిమిగొని జవ్వనం బిచ్చెఁ, బూరుఁ డను సుతుండు భూరియశుఁడు.' ఆది. 3 ఆ. 'సీ. వెలఁబెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి దాశకన్యాకేళి తప్పఁ జేసి' స్వా. ౨ ఆ. మొ. ఇట్లనుటచే 'ఇ ద్వివిధము నానవముల్ గలవార.' (నిర్వ. ౪ ఆ) అను నిట్టి ప్రయోగములును నిర్దుష్టము లగుచున్నవి.

వ్యా. చేతవిభక్త్యర్థక వర్ణకంబునఁగా 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయా బహుళంబుగా నగు' నను బాల. కా. సూ. ౨౨ చేఁ దృతీయార్థమున వచ్చు ద్వితీయ-దీనికిని-పంచమి ప్రత్యయమగు వలనకును చేసి యనుప్రయుక్తమగును.

సూ ౫. అయ్యది యొక్కచోఁ బెక్కుచోట్ల నొక్కటియ చాలెడి.

ఉ. 'సీ. వలరాజు సచివుల వడువున బెడఁగగు కర్కశస్తనములఁ
గరము వాఁడి, చూడ్కుల నతిరాగ సురుచిరాధరముల మదవిలాసా
లస మందగతుల, వక్త్రాలకంబుల వలఁదసిఖుందుల దర్పగద్గద భాషిత
ములఁ జేసి.' భార ఆది. ౫ ఆ. (ఇటఁ జేతవిభక్త్యర్థక లవర్ణకముపై
నెల్లెడల నుండవలసిన చేసి యొక్కచోటనె యున్నది.)

వ్యా. స్తనములఁజేసి......చూడ్కులఁజేసి......సురుచిరాధరములఁ జేసి...గతులఁజేసి......అలకంబులఁజేసి......సిఖుందులఁజేసి......భాషితములఁజేసి — ఇట్టేడుతావులను పూర్వసూత్రముప్రకారము ఉండవలసిన చేసి 'భాషితములఁ జేసి' యను నొక్కచోట మాత్రమే యుండియుం నర్థభంగము గల్గమికి 'చాలెడి' ననుచున్నాఁడు.

సూ ౬. ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేకప్రయోగంబునుం జూపట్టెడి.

ఉ. 'తే. స్తంభగతరత్నపుత్రిక తనదుతోఁటి, యని విలోకించి
తోడ మాటాడకునికి, నలుగడలు చూచి తెలిసి య చ్చెలువ బెదరి,
వెడల నుంకింపఁ జేదమ్మి యొడిసిపట్టె.' (తోడక = తనతోడ)
రామా. ౪ ఆ.

వ్యా. తృతీయా ప్రత్యయమగు 'తోడ' ని ప్రాతిపదికమునకుం గూర్పఁబడక తనంత వేఱుగా ప్రయుక్తమై చూపట్టుచున్నదనుచున్నాఁడు. ఇచ్చటితోడ తృతీయా ప్రత్యయము కాదనియుం 'వెంటనె' యను నర్థముగల పదమనియుం నేలతలంపరాదు ?

సూ. ౭. కొన్నియెడల ను శబ్దప్రయోగమునం దోడకు లోపంబును
వ్యవహితత్వంబును బహుత్వంబునం గానంబడియెడి.

ఉ. 'ఎ, గీ. అతనికిఁ బరలోక, విధుల శాస్త్రదృష్టి వెలయఁజేసె,
సాపగా తనూజుఁ డఖిల బాంధవులయు, బ్రాహ్మణులయుఁ దోడ భాను
నిభుఁడు.' భార. ఆది. ౮ ఆ. 'క. నెమ్మిని ధర్మజు నలువురు, దమ్ములుఁ
దమ వస్త్రములయుఁ దమశస్త్ర వరూ, ధమ్ములతోఁడను సకల హితమ్ముగఁ
బాయంగ వలయు దాస్యము కలనా.' భార. సభా. ౨ ఆ. మొ.

వ్యా. 'అఖిల బాంధవులయు' 'తమ వస్త్రములయు' నన్నయెడలం దోడకు లోపంబును, బ్రాహ్మణులయుఁ దోడనన్నచో యువర్ణ వ్యవధానముం గలదు. ఈ లోప వ్యవధానములు బహువచనమునందే గల్గుననుట విశేషము. 'ను' శబ్ద విరహితముగను నిట్టి ప్రయోగము ఉన్నది. ఉదా 'అథముల హీనుల తోడనైనఁ గోరగా దధిపా.' భార. ఉద్యో. ౨ ఆ.

సూ. ౮. ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు. అయినను దానికివలె దీని కితర కార్యంబు గలుగదు.

ఉ. 'చ. పగతుర చేతిలోఁబడక ప్రాణముతోడుత నున్నవాఁడవే.' భాగ. ౧౦ స్కం. పూ. మొ.

వ్యా. ఒకానొకచో ననుట క్వాచిత్కతాద్యోతనార్థము. ఇతరకార్యం బనగా లోపవ్యవహితత్వాది.

సూ. ౯. చతుర్థికిం బోలె వర్ణకంబు నగు.

ఉ. 'క. అనఘుల శాస్త్రవిధిజ్ఞుల, ననురక్తులఁ బితృ పితామహ క్రమమున వచ్చిన విప్రుల మంత్రులఁగా, నొనరించితే కార్యసంప్రయోగము పొంటెన్.' భార. సభా. ౧ ఆ. పక్షమునఁ గార్యసంప్రయోగమునకై అను. మొ.

వ్యా. ఈ ప్రత్యయము బాలవ్యాకరణమునం జెప్పఁబడనిది. సూత్రస్థ ను శబ్దము కొఱకై అక్కాది సముచ్చీకరణార్థకము.

సూ. ౧౦. ఉండి పదంబు పరంబగుచో నలన కందు వర్ణకమట్లు నవర్ణకంబు నగు.

ఉ. 'క. సనత్కుమారుఁడు మహాకం, జనుడెంచె బ్రహ్మలోకం బుననుండి.' భార. ఆది. 3 ఆ. మొ.

వ్యా. సూరి. 'ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయా సప్తములం ప్రాయికముగానగు' (బాల. కా. సూ. ౧౧) నని సామాన్యముగా సూత్రించినను నావర్ణకమునకు ఉదాహరణము చూపకుండుటచే నవర్ణకోదాహరణములు అసాధువులని భ్రమింపఁదగదు అనుటే ఈ సూత్రప్రయోజనము.

సూ. ౧౧. వలన కాదేశంబగు ద్వితీయా సప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు.

ఉ. ద్వితీయమీఁది యుండికి—'క విశ్వేయుం మఱిగర్భముఁ, జెచ్చెర వెలువడు మహాత్మ.' భాగ. ౩ స్కం. మొ. సప్తమిమీఁది యుండికి—'ఆ. రక్తంబు, వదనగహ్వరమున వఱదవాఱ.' భాగ. ౧౦ స్కం. పూ. 'గీ ఉదుపథంబున జాఱు సుమప్రతతి భాతి మెడహారములపైన పుడమిఁ దాఁక.' పాండు ౫ ఆ. 'నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె.' భార. ఆది. 3 ఆ. 'క. నలుఁ దొల్లి యాక్రమించిన, కలి కర్కోటక విషంబు గ్రక్కుచు నోడలన్, వెలుపడి.' భార. అర. 3 ఆ. 'ఉ. హెచ్చిన సంభ్రమంబున నశేషులు బ్రహ్మలవారలెక్కడన్, వచ్చిరియొ మోఁది రా కొలువు వారి.' కళా. ౨ ఆ. మొ (గర్భమున్=గర్భమునుండి, ఎక్కడన్=ఎక్కడనుండి. ఇట్లింతట నూహ్యంబులు.) బహుళగ్రహణముచే నందు మీఁది యుండికి లోపంబు గలుగదని యెఱుంగునది. ఈ సూత్రము నిట్లు చెప్పుటకు నం ద్వితర సప్తమ్యర్థక వర్ణకంబుల మీఁది యుండికి లోపంబువచ్చుట ప్రయోజనంబు.

వ్యా. పంచమీ ప్రత్యయమగు వలన కాదేశముగ ద్వితీయాసప్తములు వచ్చుననియు నట్లు వచ్చునపుడు దానికంటె పరంబైన యుండికి లోపము వచ్చుననియు సూత్రించుచున్నాఁడు. ప్రదేశవాచకమగు వలన శబ్ద మొండుగలదు. దానికి ద్వితీయార్థకము లాదేశము లైనను స్థానివద్భావముచే నిగర్థము నే చెప్పఁగలవు. అప్పుడు

ఉండి యనునది బుద్ధిస్థమైయే యుండును గాన స్థానికి లోపము విధింప నవసరమే లేదు. ఎల్లి+ఉండి వచ్చెడను. ఎల్లి=రేపు. 'లగ్నంబెల్లి' భాగ. ౧౦ స్కం.

సూ. ౧౨. కొన్నియెడల హేతువునం దన్నంత క్రియామీఁదను బట్టి వర్ణకంబు విభాషనగు.

ఉ. 'తే. బ్రహ్మపుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవసరమున, నెట్లు సమకూరు వీరికి నీ ప్రభావ, మీవు గలుగంగఁ బట్టిగా కింపవదన.' కాశీ. ౩ ఆ. పక్షంబునఁ గలుగుటంబట్టి. మొ.

వ్యా. బాల. కార. సూ. ౧౪ చే హేతువులగు గుణక్రియలకుఁ బట్టి వర్ణకము విహితమైయుండెను. క్రియలని సామాన్యముగఁ జెప్పినను ఉదాహరణములలో 'వచ్చుటంబట్టి' యని భావార్థకటాన్వితమును మాత్రమే ఇచ్చియున్నందునను, అన్నంత క్రియలమీఁదఁగూడ హేత్వర్థమునఁ 'బట్టి' కానగుచున్నందునను ప్రౌఢకారుఁ డిట్లు సూత్రింపవలసివచ్చెను.

సూ. ౧౩. షష్ఠీ స్థానికంబగు కు వర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకుమాఱుగాఁ దత్తదర్థంబులం జూపట్టెడి.

ఉ. ద్వితీయకు—వేఁటకుఁబోయిరి, పొలమున కేఁగెను. పక్షంబున 'వేఁటఁబోయిరి.' భాగ. అర. ౬ ఆ. 'ఆవిభుండు పొలమేఁగెను.' వి. పు. ౭ ఆ. మొ. ఇట నొకానొకచోఁ గొఱకు కయి వర్ణకంబులు నయ్యెడి ఉ. 'చ. అతఁ డొకనాఁడు వేఁటకొఱకై తను నేలినవారు వేడ్కతోఁ, బాతముగఁ బైన మాటఁగని.' భల్లా. ౭ ఆ. 'అడవికి వేఁటకై యఱిగి,' పాండు. ౫ ఆ. 'చ. చిరముగ బ్రహ్మకుం దపము చేసి.' భార. ఆది. ౨ ఆ. పక్షంబున బ్రహ్మనుగూర్చి తపము చేసి మొ. తృతీయకు—'క. లోకోత్తర చరితుం డగు, నాకావ్యృతనూజ నీకు నారాధ్యను.' భార. ఆది. ౩ ఆ. 'అనుచులకును బూజనీయులు.' హరి. పూ. ౨ ఆ. మొ. పక్షమున నీచే నారాధ్యను మొ. 'చ. అరిమదభేది నీకు

విష మాజి ముఖంబుల మార్కొనంగ నోపరు నరు లెవ్వరుఁ బోరి కిభంబులు మార్కొనునయ్య.' భార. అర. ౪ ఆ. 'అంగపతి కెదిరించెన్.' కళా. ౧ ఆ. మొ. పక్షమున నీతో మార్కొన నోపరు, వారితో మార్కొనునయ్య, అంగపతితో నెదిరించెను, (ఇట అర్థభేదము విశేషము.) పంచమికి—'క. విలువిద్య నొరులు నీ కగ్గలముగ లేకుండ.' భార. ఆది. ౫ ఆ. పక్షమున నీకంటె నగ్గలముగ. (అగ్గలము-ఇది అన్యార్థాది గణ గణ్యంబని యెఱుంగవలయు.) సప్తమికి—'కోమలి నీ కనురక్త.' భార. ఆర. ౭ ఆ. పక్షమున నీయం దనురక్త. 'శా. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ గంటిమే' స్వా. ౬ ఆ. పక్షమున నీయందు దక్క. 'ఆ. అహి విషంబుచేత ననయంబు దగ్ధుండ, నైతి నింక నాకు ననఘ నైపు' భార. అర ౭ ఆ. మొ. పక్షమున నా విషయమున నైపు. చతుర్థికి నుదాహరణంబులు పూర్వవ్యాకరణంబులం జూచునది.

వ్యా. 'ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియు నగు' నని బాల. కార. సూ. ౨౧. అందే పెక్కుసూత్రముల క్రింద నీసూత్రంపు టుదాహరణములు గలవు. ఇతర విభక్త్యర్థమునం గువర్ణకంబు వచ్చునెడలు నందుఁ జూపఁబడియున్నవి. ఏమే ప్రత్యయము లే యితర ప్రత్యయార్థములందు వచ్చునవైనను, అటు వచ్చుట 'కు' వర్ణమునకే తఱచుగఁ బ్రయోగములం గానవచ్చుచుండుటచేఁ గాఁబోలుఁ దానికి బ్రత్యేకసూత్ర ముండఁదగునని ప్రౌఢవ్యాకర్త తలంచి సూత్రించుచున్నాఁడు. సంస్కృతభాషయందలి షష్ఠీవిభక్తికి నూటయొక్క యర్థము లున్నట్లే యిందునుగూడ వచ్చునని తలంచి కాఁబోలు 'బాలప్రౌఢ' వ్యాకర్త లిరువురును కువర్ణకమును నిరుపపదముగఁ గాక షష్ఠీస్థానికమని విశేషించినారు. చతుర్థ్యర్థమునం గువర్ణకము వచ్చుట కుదాహరణంబులు—'రామునకుం గన్యనిచ్చెను; పురుషార్థంబునకు యత్నింపవలయు' నని. బాల. కారక. ౧ సూత్రవృత్తి. పక్షంబున రామునికొఱకు పురుషార్థంబుకొఱకు.

సూ. ౧౪. వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకంబగు.

ష. ఏకస్నయందు—'మ్రాని మ్రానికి సరిగి యరిగి యడుగు.' భార. అను. ౨ ఆ. 'ఇాన్లింద్లను.' కళా. ౩ ఆ. మొ. కాలపరిమితి యందు—'క. కొండొకసేపునకుఁ జెలిసి,' హరి. ఉ. ౧ ఆ. 'క. నెట్టన వర్షావధికిఁ, బెట్టంగల యప్పనములు పెట్టియు.' వి. పు. ౭ ఆ. 'ఎ. గీ. అలిగి పార్థుని శిర మాఱునెలల కుర్విఁ బ్రెళ్ళకపియించి దేవి యదృశ్య మయ్యె.' జై. ౮ ఆ. మొ.

వ్యా. బాలలోని 'ఆమ్రేడితంబు పరంబగునప్పుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' నను సూత్రముచే మ్రానికిన్ మ్రానికిన్ అని యున్నప్పుడు విభక్తిలోపము రాఁగా మ్రాని మానికిన్ అనురూపము సిద్ధించుచునేయున్నది. కావున నీసూత్రము పిష్టపేషణము. ఆమ్రేడితము వీప్సాదులందు సంభవించుచునే యుండునుగదా. కాల పరిమితియందలి ద్విత్వాగమమునకును బాల. యందలి బాహుళకముచే ప్రమాణము గల్గును. ఐనను స్పష్టార్థ మీసూత్రమని ఎంచఁదగును.

సూ. ౧౫. ధాతుజవిశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ బఱుగ యొక్కొ షష్ఠియగు.

ఉ. (౧ లో ౧) ధాతుజ విశేషణపూర్వ వ్యవహిత కర్తృపద ప్రథమకు—'బాహుకు రథంబు గడపు నేర్పున కచ్చెరు వడి.' భార. అర. ౨ ఆ. 'తన మునుపడ్డ బన్నములు.' ఉద్యో. ౩ ఆ. 'చ. కని తన మున్ను గన్నటులు గామికి విస్మయవారిరాశిలో, మునుఁగుచు.' హరి. ఉ. ౯ ఆ. 'నా యొనర్పం బూనిన కళాపూర్ణోదయంబు.' కళా. ౧ ఆ. (౧ లో ౨) ధాతుజ విశేషణ పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు—'అన్నలభూపాలకు పోయిన వలను.' భార. అర. ౨ ఆ. 'వ. వాని కన్నిన వృషభ గోమయ భక్షణంబుచేసి.' భార. ఆది. ౧ ఆ. 'తే. ఎఱుక గలఁడేని మఱి శక్తుఁడేని నన్య, లన్యులకు హింసగావించు నపుడు దాని, బూని వారింప కున్న నప్పురుషుఁ డేఁగు, హింస చేసిన వారల యేఁగు గతికి.' భార. ఆది. ౭ ఆ. 'వ. అపార పారావార పర్యంత మహీతలంబు నందు నాచూడనిరాజు లెవ్వరును లేరు.' భార. అర. ౨ ఆ. 'తే. ఆ జర

త్కారుఁ గని చెప్పు మయ్య వాని, నెఱుఁగుదేని మా పడియెదు నీ యవస్థ.' 'వ. నీ చేయుం బేదవ నన్నుం దాఁక నోపదు.' భార. ఆది. ౭ ఆ. 'సీ. హంసచేఁ దన వినినంత కంటెను రూప విభవాతిశయముల వెలుఁగుదాని' భార. అర. ౨ ఆ. (౨ లో ౧) భావార్థక పూర్వ వ్యవ హిత కర్తృపద ప్రథమకు—'వ. మన పుట్టు బుద్ధి యెఱుఁగుట మొదలు.' హరి. పూ. ౫ ఆ. (౨ లో ౨) భావార్థక పూర్వావ్యవహిత కర్తృపద ప్రథమకు—'క. పరీక్షి, జ్జనపాలుఁడు చనుటఁ గృశుఁ డను, మునివలన నెఱింగి.' భార. ఆది. ౨ ఆ. మొ. తఱచుగ ననుటచే బాహులకుండు రథంబు గడపు నేర్పనకు ఇత్యాదు లెఱుంగునది. 'క. మేము వ్రతింపని శాస్త్రములె మాపతింకని శ్రుతులే.' అను. ౬ ఆ. మొ.

వ్యా. నలుదెఱంగుల కర్తృపదముల ప్రథమకు యొక్క షష్ఠి బహుళముగ వచ్చునని సూత్రార్థము. నలుదెఱంగు లేవియనఁగా (౧) ధాతుజ విశేషణమునకు ముందుండి ఆవిశేషణముతోఁ గొంత వ్యవధానము నందియుండునది. (౨) తాదృగ్వ్యవ ధానంబు లేకయ ధాతుజవిశేషణమునకు ముందుండునది. (౩) భావార్థకమునకు ముం దుండి యద్దానితోఁ గతిపయ శబ్దాంతరములవలన వ్యవధానము నందియుండునది. (౪) తాదృగ్ వ్యవధానముఁ దొఱంగి భావార్థకమునకుం బూర్వమైయుండునది. 'వారల యేఁగుగతికి' నను భారతోదాహరణమున తచ్ఛబ్దాంత్యాత్తును అవధారణార్థక మును గ 'గతిక'నుచోట నన్వయించుకొవలసినదానిం గా నైతము కొననగును. భార తములోని యవధారణార్థకముల కన్వయ మిప్పటి మన వ్యవహారమునకుఁ గొంచెము దూరమై పైనఁజూపినరీతి నచ్చటచ్చట నగపడుచుండును.

సూ. ౧౬. యొక్కకు లోపంబు బహుళంబు.

ఉ. 'ఉ. ఇమ్ముగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశు బింబమ్మున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణ రంధ్రమ్మున నంజలిం దవిలి త్రావుదురు.' భార. ఆది. ౧ ఆ. 'ధర్మజా నలువురు దమ్ములు' భార. సభా. ౨ ఆ 'తే. ఇరులు గెలిచిన యంతక పురేందు ముఖుల, నిరులు మరుఁ దను వేఁటకాఁ డురులువేసి, మరులు గొలు

కంగ లేఁడయ్యె మనుజవిభుని, పరులు లేని దృక్లక్షంజన శాబకముల.' నై. 3 ఆ. 'సీ. వారిప ధమ్మిల్ల భారాంకకలిత దివ్యామోద నవపుష్ప దామములయు.' భార. అర. ౨ ఆ. (వారిప=వారిఁ బేర్చిన. ఇక్కడ నిది షష్ఠ్యంతమునకు విశేషణముగనుక ప్రథమ.) 'ప, గీ. అపుడు సమ్మెట కోలల యంకుశముల, చేబు కోలల వ్రేటుల (సమ్మెటకోలలయొక్కయు, అంకుశములయొక్కయు, చేబు కోలలయొక్కయు వ్రేటులచేత నని యర్థము. ఇట అంకుశముల వ్రేటులనఁగా లక్షణచేఁ బోటులనని యెఱుంగనగు.) ద్రోణ ౩ ఆ. 'క. నర గో మృగ సింహంబుల, కరుణములగు రోగ వేగ కలితాక్రోశ, స్వరములు పెక్కయ్యె.' హరి. పూ. ౬ ఆ. 'క. తాతల తండ్రుల తరమున నేతెంచిన వృత్తి దక్క.' విజ్ఞా. వ్య. బహుళ గ్రహణముచే ధాతుజ విశేషణ భావార్థకముల ముందటి కర్తృపదంబులయొక్కకు నిత్యంబుగ లోపంబని యెఱుంగవలయు.

వ్యా. 'సమాస విభక్తికి లోపంబగు లట్లునకుఁగాదు.' అను బాల సమా. సూ. ౨౫ చే విభక్తుల కన్నింటికి సమాసములయందుమాత్రమే లోపము సిద్ధించుచున్నది. యొక్కకు మాత్రము వ్యస్తమునను లోపముండుటచే దానిని సాధింప నీ సూత్రారంభము.

సూ. ౧౭. ఒక్కచో నుదంతంబగు న జడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి.

ఉ. 'ఉ. ఏపునఁ గిట్టియేనుఁగున నేనుఁగు వైచుచు వాజివాజిచే, రూపడఁగంగ మోఁదుచును.' రా. యు. కాం. (దీనికి బ్రయోగాంతరంబు మృగ్యంబు.)

వ్యా. ఉదంతజడము తృతీయకుమాత్రమే బాల. కార. సూ. ౨౩ చే నవర్ణకంబు విహితము. ఇట మహాప్రాకృత ప్రయోగమునమాత్రమే న జడంబునకును ఆ కార్యము గల్గియున్నది. ప్రయోగవైరళ్యముంబట్టి సూరి దీని నుపేక్షించియుండును.

సూ. ౧౮. కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి.

ఉ. తృతీయకు—'ఏ. అతని దోర్మధ్య సరసి నోలాడుచున్న, ఘన తర స్తన చక్రవాకముల సరి, నంబ సమరేంద్ర కూఁతు రింపార గనియె.' హరి. ఉ. ౭ ఆ. సప్తమికి—'బలిమిఁ గొనిన ధనము పదివేల యొంటెలఁ, బెఱికి రాఁగ నైరి భీకరుండు, వచ్చె నకులుఁడు.' భార. సభా. ౧ ఆ. 'మనుజుల విప్రుండు' (చూ. శబ్ద. ౬౨ సూ.) భార. శాంతి. ౧ ఆ. మొ.

వ్యా. 'జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' నని బాల. కార. సూ. ౩౩. 'చక్రవాకములన్' 'ఒంటెలన్' ఇవి యజడంబులకును ఆకార్యము గల్గుట దెల్పుచున్నందున, నీ సూత్రము రచింపఁబడినది. అజడంబు తృతీయా సప్తములకు ద్వితీయాదేశము బహువచనమందె గానవచ్చుచున్నదనుట విశేషము.

సూ. ౧౯. కొన్నియెడల న జడంబు ద్వితీయకును ప్రథమ గానం బడియెడి.

ఉ. 'చ. అనిన జవంబునం బఱచు నమ్మదనాగ మెఱిర్చి క్రమ్మ ఱిం,చిన పరిశాఁడు వోలెఁ గురుసింహవరూథము నిట్లు క్రమ్మఱిం, చునె.' భార. ఆది ౮ ఆ. 'తన వారణేంద్రము కుమారుకుల వీరు మీఁద నెస కొల్పిన.' భార. అర. ౬ ఆ. 'తత్ క్రతు హయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంపుచున్.' జై. ౪ ఆ. మొ.

వ్యా. 'జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' నని బాల. కార. సూ. ౩౮. బహుళంబుగా ననుటచే న జడంబుల ద్వితీయకుం బ్రథమ గల్గిన పట్లకును బ్రమాణము గల్గఁదగియున్నను స్పష్టార్థము ఈ ప్రౌఢసూత్రము.

సూ. ౨౦. ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు.

ఉ. 'వాహికము నాఁగఁ బరఁగు తీర్థమాడి మేధా సమన్వితు లగుదురు.' 'చ. వ్రతములు లేనివారు నుపవాస పరాఙ్ముఖులైనవారు దుష్కర్మతులఁ విహీన శౌచులుఁ గ్రమంబునఁ దీర్థము లాడ నోపరు.' భార. అర. ౩ ఆ. 'ఉర్విం గల్గు తీర్థంబు లెల్లను నే నాడుచు.' హరి.

పూ. ౫ ఆ. 'ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన శరములు, నెఱుఁకు లాడి.' భార. అర. ౧ ఆ. 'వ. పొలిఁబోరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై.' భార. శల్య. ౧ ఆ. 'అవ మిడిసఁ బగిలి పోవు టయ్యె.' భార. స్త్రీ. ౧ ఆ. 'ఎ, గీ. మట్టి కందముల్ వడిఁ గత్తి పెట్టి పెట్టి.' హరి. పూ. ౬ ఆ. 'శా. భావంబుల్ భయ ముజ్జగించి చోరుఁ డీ భవ్యాద్రిచా టందఱున్.' హరి. పూ. ౭ ఆ. 'మ. కనుఁగొంటిం బర మేష్ఠిఁబోట్టి సురసంఘుం బేకతం బుండఁగన్.' హరి. పూ. ౫ ఆ. 'ఎ, గీ. లీలఁ బేరోలగంబున్న నీలవర్ణు.' ఉ. హరి. ౪ ఆ. 'శారఙ్గ గుణగాఢ రవంబు నభంబు నిండఁగాన్.' నిర్వ. 3 ఆ. 'అదియున్ మేనుఛ్చి.' రా. అర. కాం. ౨ ఆ. 'జనయిత్రి చిచ్చుఁ బెకిన.' జై. ౧ ఆ. 'తే. పంకము గొరిజ దిగఁబడ పఱవ లేవు, మన్ను లివ్వోళ్ళ రేగటి మన్నులందు.' స్వా. ౪ ఆ. మొ. పక్షాంతరమునఁ దీర్ఘమం దాడి, మొ. ఇట్టి ప్రయోగములచేత 'అన్యస్యా క్వచిద్ భవే చ్చాన్యా' అను శబ్ద శాసనుల సూత్రము సార్థక మగుచున్నది.

వ్యా. 'అన్యస్యాః క్వచిద్ భావే చ్చాన్యా' (చింతామణి) 'ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియు నగు' (బాల. వ్యా)—ఇత్యాది సామాన్యశాస్త్ర మున్నను. 'జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' 'జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' 'సర్వనామసంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు.' 'ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభావనగు' నిత్యాది ప్రత్యేక విధులు సప్తమ్యర్థమునం బ్రథమవచ్చుట బాల. లో లేనందున ప్రౌఢకారుఁ డిటం బూరించెనని గ్రహించునది.

సూ. ౨౧. ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబుల కగు విశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి.

ఉ. 'పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతు ప న్నిది నీకు నలంఘ్యము.' భార. అర. ౬ ఆ. 'లస దగణ్య గుణౌఘ విచిత్రుఁ డ మ్మహాత్మ చరితంబులు,' 'ఉత్ఫుల్లలోచనుఁ డా విష్ణుని మూర్తితో.' హరి. ఉ.

౫ ఆ. 'విస్ఫురన్మహావిక్రముఁడైన దేవుఁడు త్రివిక్రము సొమ్ములు.' హరి. ఉ. ౬ ఆ. మొ.

వ్యా. 'ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు' నను. బాల. కార సూ ౨౭ చేతనే ఈ ప్రథమసిద్ధించును. కాని సమానైకదేశముతో వ్యస్తపదము లన్వయింపవచ్చునను విశేష మిందు సూచించుచున్నది. ఇందలి మొదటి యుదాహరణమును మఱి కొన్నిటికిని కవిసంశయ విచ్ఛేదకారుఁడు చూపియున్నాఁడు.

సూ. ౨౨. కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకును బ్రథమ చూపట్టెడి.

ఉ. 'అహీన బాహుబలసార ఘనుల్ మఘుకైటభాది దైత్యపతుల నెల్లఁ ద్రుళ్లడఁచె.' నిర్వ. ౫ ఆ. 'క. తండ్రి ఘటోత్కచుఁడు మీ, తండ్రి గలుగఁ గాచె తల్లి ద్రౌపదితోడన్, దండ్రుల వారి దీశ్వరు లెన,మండ్రు వొగడఁ జెచ్చె గంధమాదనమునకున్.' జై. ౧ ఆ. మొ. 'షష్ఠీవిశేషణానామ్.' అను బహువచన సారస్య మిట్టి ప్రయోగముల కుత్పాదకముగా నున్నయది. మఱియుఁ నేతద్ విశేషంబు లనేకవిధంబులు గలవ్రగ-ని ప్రామాణిక ప్రయోగములు దొరకమిం జేసి యవి యనాదృతంబు లయ్యె.

వ్యా. 'భవత్యర్థక వ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు'నని బాల. కార. సూ. ౨౦. భవత్యర్థక వ్యవధానము లేనప్పుడును ప్రథమ రావచ్చునని ప్రకృత సూత్రార్థము.

సూ. ౨౩. క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామి సంబంధముగలచో సంబంధిపదంబు షష్ఠికి ద్వితీయ యగు.

ఉ. 'క. కొన్ని వెడమాట లాడుచు, నన్ను నతఁడు చెట్టపట్టెనన్.' భార. విరా. ౨ ఆ. 'ఉ. కట్టియవైచె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రి లేఁ, బట్టిని.' భార. శల్య. ౧ ఆ. 'రాము తమ్మున్ అవుం డిసు మూఁడమ్ముల జొసముం దునుము.' జై. ౬ ఆ.

'క. నరసూను నప్రపు కర్ణజుఁ, డిరుమూఁడు శిలీముఖంబు లెద సించిన,'
జై. ౭ ఆ. మొ.

వ్యా. 'నాదు చెట్టవట్టినన్' 'లేఁబట్టియొక్క నెన్నుదురు గాడన్.' 'రాము తమ్మునియొక్క చాపమున్' 'నరసూనుని యొక్కయెద'—ఇత్యాదిగాఁ బష్ఠ్యంతరంబున రూపంబు లగునని యెఱుఁగునది.

సూ. ౨౮. ఒక్కచో ద్వితీయాంత విధేయ విశేషణంబునకుం బ్రథమయు నగు.

ఉ. 'ఉ. ఎవ్వనిం, బ్రకట ధర్మతత్త్వవిదు బ్రాహ్మణ ముఖ్యుఁ బురోహితుండుగాఁ, జేకొనువారము.' భార. ఆది. ౭ ఆ. 'క. రయమున మ్రింగుడుఁ గాలము, క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికిఁ జన కగ్నియుఁ బోలెలో దహించును, భయరహితా వాని నెఱుఁగు బ్రాహ్మణులుఁగాన్.'

వ్యా. 'ప్రథమయునగు' ననుచోట సముచ్చయార్థక మువర్ణముచే ద్వితీయయు గ్రహింపఁబడుచున్నది. ద్వితీయాంతముల విధేయ విశేషణము ద్వితీయాంతముగానేని ప్రథమాంతముగానేని యుండఁదగును 'పురోహితుఁడుగా'—ఇది ప్రథమాంతతకును 'బ్రాహ్మణులుఁగాన్'—ఇవి ద్వితీయాంతతకును ఉదాహరణములు.

సూ. ౨౯. కొన్నియెడల విధేయ విశేషణ మొండ బహువచనాంతం బయి విశేష్యంబులు పెక్కింటి కన్వయ యోగ్యంబగు.

ఉ. 'క. ఇది దక్షిణాపథంబున, కిదియు విదర్భాపురమున కిది కోసల కిం, దిది యుజ్జయినికిఁ దెరువులు, మది నిన్నిటిలోన నరుగ మన కెద్దియగున్. భార. అర. ౨ ఆ. బహువచనాంతము కాక యేకవచనాంతమైనచోఁ దెరువు త్రై దుండవలెను.

వ్యా. ఉద్దేశ్య మిట ఇది. విధేయవిశేషణము తెరువులు. బహ్వంతతచేఁ బెక్కు విశేష్యముల కదియొక్కటే యుండఁజెల్లెననియుం ఏకవచనాంతమైనచో నైదుపర్యాయములు 'తెరు'వనునది ప్రయోగింపవలసియుండుననియు సూత్రవృత్త్యర్థము. 'ఈ

(1) తెరువు దక్షిణాపథంబునకు (2) తెరువు, ఇదియు విదర్భాపురమునకుఁ (3) తెరువు' ఇది కోసలకుఁ (4) తెరువు, ఇం దిది యుజ్జయినికిఁ (5) తెరువు' అని యుండుననుట.

సూ. ౨౬. కొన్నిచోట్ల విభక్తి పరిణామంబు గ్రాహ్యంబు.

ఉ. 'ఈతనితో సాటి యనంగ మేలన.' (మేలన=ఈతనికంటె మేలన. ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పు గలిగెనని తెలియవలయు.) నిర్వ. ౩ ఆ. మొ.

వ్యా. 'సాటి' యనుటకుముందు 'ఈతనితో' నని తృతీయాంతముగ నుండు సర్వనామమును 'మేలన' ననుటకుముం దన్వయించుకొనునపుడు 'ఈతనికంటె' నని పంచమ్యంతముగా మార్చుకోవలయునని సూత్రార్థము.

సూ. ౨౭. తచ్ఛబ్దాంతములగు ధాతుజ విశేషణంబులమీఁద నరు చూపట్టదు.

ఉ. 'శా. ఏయేదేశములం జరించితిరి మీ రేయేగిరుల్ చూచినా,
రేయే తీర్థములందుఁ గ్రుంకిడిరి రేయేద్వీపముల్ మెట్టినారు.' స్వా.
౧ ఆ. మొ.

వ్యా. 'చూచినారరు' 'మెట్టినారరు' అని రూపము లేర్పడలేదనుట. కాని ఇట్టి ప్రయోగములు స్వీయవ్యాకరణ కారు. సూ. ౩౮ లోని ప్రాయికగ్రహణముచే రక్షితములని సూరి.

ఇది బాలబోధసుధాపరనామ కుమారదేవపండితీయం బగు
ప్రౌఢవ్యాకరణ వివరణమునందు
కా ర క ప రి చ్ఛే ద ము.

---

